# అరుణకిరణాలు

వ చ న క వి తా సం పు టి

అక్రమంగా ఆస్తులుపెంచే అమానుషత్వాన్ని
అక్రమంగా శ్రమను దోచుకునే రాక్షసత్వాన్ని
అతితీవ్రంగా ఎదుర్కొని నేలగూల్చాలి
అందరూసమానంగా జీవించేవ్యవస్థనునిర్మించాలి.

# కృతజ్ఞతలు

అరుణకిరణాలు పుస్తకరూపంగా రావడానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఆదరంతో 500 రూ॥లు ధనసహాయం చేసింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి, కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి ముందుగా నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ గ్రంథానికి ఆదరంతో ముందు మాటవ్రాసిన సుప్రసిద్ధకవులు, వక్తలు, పండితులు, సోదరులు శ్రీ స్ఫూర్తిశ్రీగారికి (టి. భాస్కరరావుగారు, తెలుగు లెక్చెరర్, A. C. కాలేజీ, గుంటూరు) నా కృతజ్ఞతలు.

ఈ గేయాలలో కొన్ని ఆంధ్రప్రదేశ్, జీవనాడి, వెలుగు, అరుణ, సామ్యయోగం, విశ్వరచన, కేకలు, స్రవంతి, ప్రకృతి మొదలగు పత్రికలలో ప్రచురింపబడ్డాయి. ఆయా పత్రికాధిపతులకు నా కృతజ్ఞతలు.

ఆకాశవాణి విజయవాడ కేంద్రంనుంచి కొన్ని గేయాలు ప్రసారమయ్యాయి. రేడియో నిర్వాహకులకు నా కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని అందముగా ముద్రించిన శ్రీ పతి ప్రెస్ గణేశ్వరరావుగారికి నా కృతజ్ఞతలు. పుస్తకం టైటిల్ అరుణ కిరణాలు అందంగా చిత్రించిన చిత్రకారులు శ్రీ J. V. రమణా రావుగారికి నా కృతజ్ఞతలు. ముఖచిత్రాన్ని అందంగా అలంకరించిన వర్ధమాన రచయిత, చిత్రకారుడు తమ్ముడు చిరంజీవి సుధామకు నా ఆశీస్సులు.

— అడవికొలను పార్వతి

మాజీరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి.

My dear Sister,

Mrs. Giri has received your publication "Padmalu Parijatalu" and she has much appreciated your affectionate regards for her.

Kind regards,

*Yours affectionately,*
**V. V. Giri.**

* * * * *

డా॥ సి. నారాయణరెడ్డి

మీరు ప్రచురించిన అరుణకిరణాలు మీ ఉదయమాన కవితామూర్తికి ఆభరణాలు. మహిళాభ్యుదయమే పల్లవి. మానవత, అభ్యుదయభావుకత మీ చరణాలు. మీరచన ఇంకా ఇంకా శిల్పబంధురంగా వెలువడాలని ఆకాంక్షిస్తున్నాను.

శ్రీ కుందుర్తి ఆంజనేయులు

మీ రచనలోవున్న అభ్యుదయ కవితావేశం (యిది "భవ్య కవితావేశం") నన్ను చకితుణ్ణి చేసింది. ఆధునిక కవితారంగంలో స్త్రీలు చాలాతక్కువగా ఉన్నారు. మీవంటివారు ఆ లోటు తీర్చగలుగుతారు. నేటి సమాజవ్యవస్థ, దాని తీరుతెన్నులు, దాని రోగకారణాలను గురించి మీకు సరియైన, శాస్త్రీయమైన అవగాహన ఉండడంవల్ల మీరచన ప్రత్యేకరంలో సామాజిక ప్రయోజనచైతన్యం తొణికిసలాడుతున్నది. హిమవన్నగంమీది నుండి దూకుతున్న గంగానదిలా మీ ఆవేశం ఉరకలు పెడుతున్నది, చైతన్యసముద్రంలోకి మహిళా సమస్యలకోసం మీ కవితాప్రతిభను వినియోగిస్తూ మీరు స్త్రీ జాతికి మహోపకారం చేస్తున్నారు.

పూర్ణమ్మకథ చదివిన ప్రతిసారి నాకండ్లనిండా నీళ్లు గిర్రున తిరుగుతాయి. మీకు వచనకవిత్వమే కాకుండా మాత్రాఛ్ఛందస్సులో కూడాచేయి తిరిగింది.

— కుందుర్తి.

Andhra Mahila Sabha

**Dr. Smt. Durga Bai Deshmukh**

*President.*

Dear Smt. Parvathi,

It is so nice and thoughtful of you to have sent me your book "Padmalu Parijatalu". I am sorry for the delay in acknowledging the receipt of this book and replying to your letter. I thought I would wait till I have read the book. Now that I have completed I am writing to you to inform you that I have gone through all the stories.

I enjoyed in going through them and in congratulating you finally for presenting this book to the reading public, which, I am sure, will appreciate your effort. I must say that the themes you have chosen for these five stories are excellent. They represent varied aspects and problems of young women and bring out how successfully they tried to tackle them. The stories are very interesting, instructive and also informative. I am sure that you will be sending further publications as and when they are out, and I will be happy to go through them. In the mean while, let me thank you once again for sending this book to me. I am sending this to the Andhra Mahila Sabha School Library which caters to the needs of thousands of young girls and women. The Colleges of Andhra Mahila Sabha also will need such publications.

With all good wishes,

*Yours sincerely,*

**Durgabai Deshmuk.**

# ఆలోకనం

## స్ఫూర్తిశ్రీ

౧

అరుణ కిరణాలు విప్లవానికి సంకేతం; నవోదయానికి సంకేతం; నవ్యచైతన్యానికి సంకేతం.

తమస్సును ఛేదించుకుంటూ అరుణకిరణాలు ఆకాశాన్ని ఆక్రమించుకుంటాయి; భూతలమంతా ఆవరించుకుంటాయి. రోదసీగర్భం వెలుగు వెల్లువలను పూరగించుకుంటుంది. అచ్ఛమైన దృష్టి అభ్యుదయసృష్టికి దోహద క్రియలు నిర్ణయించి నిర్వహిస్తుంది.

తమస్సు నశించినప్పుడే మహస్సు వెల్లడవుతుంది. నిశ తమస్సు నిలువల్లా పులుముకుంటుంది. తమస్సు అంతం కావాలంటే నిశాంతం కావాలి. నిశాంతమైనప్పుడు ప్రభాతం ప్రశాంతంగా ఉదయిస్తుంది. నిజానికి నిశాంతమే ప్రభాతం. ప్రభాతం అరుణకిరణసమేతం; సముజ్జ్వల చైతన్య నికేతం.

నిశ అజ్ఞానం; నిశాంతం విజ్ఞానం. నిశ తమోమయం; నిశాంతం మహోదయం. నిశ జడత్వజర్జరితం; నిశాంతం చైతన్యచకచ్చకితం. నిశ దృష్ట్యవరోధం; నిశాంతం సృష్ట్యవబోధం. నిశ సంఘమరణం; నిశాంతం సంజీవనం. నిశ లొంగుబాటు; నిశాంతం తిరుగుబాటు. నిశ అవ్యవస్థ; నిశాంతం సువ్యవస్థ.

అటువంటి నిశనుతొలగించి, యిటువంటి నిశాంతాన్ని ప్రశాంతంగా నెలకొల్పి, దూర దూర తీరాలకు తమ ఆహ్వానాన్ని అందజేసి, వైతాళికగానాన్ని వినిపించి, పసిడివెలుగులు ప్రసాదించి, అభ్యుదయపథంలో స్వాతంత్ర్యరథాన్ని కదలింపజేస్తాయి అరుణకిరణాలు.

౨

'అరుణకిరణాలు' శ్రీమతి అడవికొలను పార్వతిగారు రచించిన కవితాసంపుటి. ఇదివరకే శ్రీమతి పార్వతి 'ఉదయ పవనాలు' అనే కవితాసంపుటితో పాఠకుల హృదయపద్మా లను స్పృశించి యించించుక కదలించారు. ఇప్పుడీ 'అరుణ కిరణాలు' వెలుగునూ, వేడినీ, మమతనూ, సమతనూ పంచుతూ అవతరించింది. దీనితో పాఠకుల హృదయపద్మాలు వికసించి సురభిళిస్తాయనీ, పులకించి పరవశిస్తాయనీ ఆకాంక్ష.

ఇందులో ముప్ఫయి కవిత లున్నాయి. ఇవన్నీ వేరు వేరు సన్నివేశాల్లో వేరు వేరు సమయాల్లో వ్రాసినవే. పట్టు పట్టి ఒకగ్రంథంగా వ్రాయాలని వ్రాసినవి కావు. అనేక కవితా గోష్ఠుల్లో, ఆకాశవాణి ప్రసారాల్లో కొన్ని వినిపిస్తే, వివిధ పత్రికల్లో కొన్ని కనిపించాయి. వాటిలో కొన్నింటి నేర్చి కూర్చగా ముప్ఫయికవితలతో ముచ్చటయిన యీగ్రంథం రూపుదిద్దుకొంది. ఉద్దేశించినా, ఉద్దేశించకపోయినా కవితల సంఖ్యనుబట్టి 'అరుణకిరణాలు' త్రిదశత్వం తన తత్త్వంగా ఆవిష్కరిస్తున్నది. త్రిదశులు దేవతలు. బాల్య యౌవన కౌమారదశలు మూడే కాని, నాల్గవదైన వార్ధకదశ దేవతలకు లేదట! మానవులుకూడా త్రిదశులుగా, నిర్జరులుగా ఉండా లన్నదే త్రిదశత్వంలోని రహస్యమాం? మనుష్యుల్లోకూడా గుణత్రయాన్నిబట్టి స్థితిత్రయం ఏర్పడుతుంది. పాశవస్థితి, మానవస్థితి, దైవికస్థితి అన్నమూడూ మూడంతస్తులు. కళలు పశుదశావరణంలో ఉన్న మనుష్యుల్ని స్వకీయావరణాన్ని చేరుకునేటట్టు చేస్తాయి; అక్కడనుంచి దైవత్వం గమ్యంగా రమ్యమైన మార్గంలో నడిపిస్తాయి. ప్రకృతగ్రంథంలోని త్రిదశత్వం ఆ అమరత్వాన్ని సంకేతిస్తున్నదా? ఏదయినా

ఒక్కటే. దూరంనుంచి చూచినప్పుడు వేరుగా కనిపించినా, సన్నిహితంగా చూచినప్పుడు అంతర్నిహితమైన తత్త్వం ఒక్కటే అనిపిస్తుంది. వయసులో, మనసులో ముసలితనం రాకూడదు; వాక్కులో, వర్తనలో దైవత్వం ప్రస్ఫుటించాలి.

'జరావ్యాధుల కరాళనృత్యం సమసిపోయి
యౌవనోత్సాహాల సుధాతరంగాలు
ప్రతిఒక్కరి రక్తనాళాల్లో
ఆనందనాట్యాలు చేస్తాయి'

'చేస్తాయి' అని ఉన్నా 'చెయ్యాలి' అన్నది ఆకాంక్ష. కవిత్వంలోనిమాటలు ఒకకాలంలో ఉండి కాలాంతరాన్ని ధ్వనింపవచ్చు; ఒకదేశంలోఉండి దేశాంతరాన్ని ధ్వనింపవచ్చు; ఒక అర్థంలోఉండి అర్థాంతరాన్ని ధ్వనింపవచ్చు. అయితే, దీనినంతటినీ గ్రహించాలంటే సమయాన్నీ సందర్భాన్నీ పూర్తిగా అవగాహన చేసుకోవాలి. 'అవగాహన' అని అనడంవల్ల ఇదంతా బుద్ధివ్యాపారంవల్ల సాధ్యమే అనిపిస్తుంది. బుద్ధిబలంవల్ల కవిత్వసృష్టి సాగదు; కవిత్వపుష్టి అలవడదు. కవిత్వానికి మూలబీజమైనా, ఆలవాలమైనా భావనాబలమే. కవి ఎంతటి భావనాబలంతో రచిస్తాడో, పాఠకుడుకూడా అంతటి భావనాబలంతో పఠించినప్పుడే సాహిత్యసరస్వతి సమగ్రరూపంతో సాక్షాత్కరిస్తుంది. అటువంటి భావుకునికిమాత్రమే సహృదయుడన్నపదం సార్థకమవుతుంది; సాహిత్యపరమార్థం అన్వర్థ మవుతుంది.

3

అందరికీ అర్థమయ్యేట్టు వ్రాస్తేనే కవిత్వమంటారు

కొందరు; కొందరు ఎవరికీ అర్థంకాకుండా వ్రాయడమే కవిత్వ మనుకుంటారు. కొందరికి పద్యంలో వ్రాస్తేనే కవిత్వం; కొందరికి గేయంలో వ్రాస్తేనే కవిత్వం; కొందరికి వచన కవితల్లో వ్రాస్తేనే కవిత్వం. 'భిన్న రుచిర్హి లోకః'.

నిజానికి కవిత్వం పద్యంలోనే ఉండాలన్న నిర్బంధమూ లేదు; ఉండరాదన్న నిషేధమూ లేదు. పద్యకావ్యం, వచన కావ్యం అన్నమాటలు మనకేమీ క్రొత్తవికావు. శాస్త్ర ముద్రకూడా ఉంది. అయితే, ఆంధ్రసాహిత్యంలో పద్య కవిత్వమే పలుకుబడి సంపాదించుకుంది. ఆవిర్భవించిన కాలాన్నిబట్టి చూస్తే గేయకవిత్వానికే అగ్రతాంబూలం అందాలి. అయినా, అది రాజాదరణకు నోచుకోక, నాగరకుల క్రీగంటిచూపులప్రాపులేక, జానపదుల హృదయాల్లోనే పది లంగా ఉండిపోయింది. తరువాత, భక్తిసాహిత్యంలో గేయా లతోపాటు వచనాలూ విన్నపాలూ కైవారాలూ మొదలై నవి ప్రవేశించి ప్రాభవం గడించుకున్నాయి. వీటన్నింటికీ సంగీతంతో, ఇంతో అంతో సంబంధ ముంది.

ఆధునికకాలంలో ఆంధ్రసాహిత్యం వచనంలో అందాలు దిద్దుకుంది. పాశ్చాత్య సాహిత్యాలతో సంబంధం పెంపొందించుకుంది. అక్కడి ఛందోరీతులు కొన్ని యిక్కడ పాతుకున్నాయి. అటువంటివాటిలో 'వచనకవితారీతి' ఒకటి. దీనిని కొందరు వచనగేయ మంటున్నారు; కొందరు వచనపద్య మంటున్నారు; కొందరు ముక్తచ్ఛందమంటున్నారు; కొందరు స్వచ్ఛందకవిత అంటున్నారు. ఇంకా ఏమేమో అంటున్నారు.

ప్రాక్తనమానవుడు పొందిన భావావేశానికి అను గుణంగా అతనినోట ఆశువుగా వెలువడినదే గేయకవిత్వం. పదిమందీకలిసి పనిపాటులు చేసుకునేటప్పుడు సాముదాయి

కంగా పాడుకున్నదే గేయకవిత్వం. దీనిలో లయ ఉంటుంది; సమత ఉంటుంది; అక్షర సాజాత్యం ఉంటుంది. ఈనియమాలన్నీ అందాన్ని పోషించడానికీ, ఆవేశాన్ని ఆవిష్కరించడానికీ మాత్రమేకాని స్వేచ్ఛను అరికట్టడానికీ స్వచ్ఛతను చెడగొట్టడానికీ మాత్రంకాదు. తరువాతికాలంలో విద్యావంతుల వంతు వచ్చింది. కవిత్వంలో రీతి మారింది; ఇతివృత్తం మారింది. స్వచ్ఛందమైన 'లయ'కాక సానుక్రమమైన 'రాగం' ప్రాధాన్యం వహించింది. అక్షరగణాలు, యతులు, ప్రాసలు బిగిసిపోయాయి. ఆనాడు పాఠకులు ఒకరో యిద్దరో ఉండగా వందలాదిగా శ్రోతలుండేవారు. పాఠకుడు (పౌరాణికుడు) పద్యాన్ని శ్రావ్యంగా చదివి, విపులంగా వ్యాఖ్యానం చేసి, మళ్లా మళ్లా పద్యాన్ని చదువుతూ పరవశిస్తూ, పరవశింపజేసేవాడు. ఆపురాణకాలక్షేపంవల్ల, ఒకపాటి ధారణగలశ్రోతలు ఆపద్యాన్ని కంఠస్థం చెయ్యగలిగేవాళ్ళు. ఒకవేళ మరచినా, రాగధోరణిలో మననం చేసుకుంటే యతి ప్రాసల సహాకారంవల్ల పూర్తిపద్యాన్ని స్మరణకు తెచ్చుకోగలిగేవాళ్ళు. అది యీనాటికీ అనుభవంలో ఉన్నవిషయమే. తరువాతి కాలంలో పాఠకులసంఖ్య పెరిగింది. వీళ్ళలో అధికసంఖ్యాకులు ఆత్మానందంకోసమే కవితాధ్యయనం చేస్తున్నారు. గొంతెత్తి గానంచెయ్యడం మానుకుని, కళ్ళతోనే కమనీయతను జుర్రుకుందామనే అభిలాష అధికమయింది. కొందరి ధ్యానం గానంమీదికి పోనే పోదు; అది వాళ్ళకు అచుంబితవిషయం. ఇతరభాషల్లోని కవితలను చదవడం అలవాటుపడ్డవాళ్ళు అర్థసౌందర్యంతోనే తృప్తిపడుతున్నారు. ఆవిధంగానే మాతృభాషాకవితల్లోకూడా అర్థసౌందర్యమే అన్వేషించడం ప్రారంభిస్తున్నారు. అందువల్ల ఆధునికకాలంలో

కవిత్వం సంగీతసహకారంతో తెగతెంపులు చేసుకుంది. ఆధునిక కాలంలోని వేగం, ఉద్వేగంకూడా అందుకు సహకరించాయి. ఆధునికసమాజంలోని విషమతనూ, అవ్యవస్థనూ బయటపెట్టడంలో వచనకవితలు ఉచితస్థానాన్ని సంపాదించుకున్నాయి. ప్రచారానికీ, ప్రబోధానికీ ప్రముఖసాధనంగా ప్రతిష్ఠను గడించుకున్నాయి.

'అరుణకిరణాలు' కవితాసంపుటిలో మూడు మాత్రమే గేయకవితలు. తక్కిన ఇరవైయేడూ వచనకవితలు. ప్రతి కవితలోనూ ఆవేశం పరవళ్ళుతొక్కుతున్నది. సమ సమాజ నిర్మాణంకోసం, అక్రమాల నిర్మూలనంకోసం, ఆడవాళ్ళ కళ్ళలోని ఆవేదన తొలగించడంకోసం, ఇంటింటా కవితా సమతాదీపాలు వెలిగించడంకోసం, నవకాంతివర్షం నిండుగా కురిపించడంకోసం, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో పృథ్వి కనిపించడంకోసం కవయిత్రి పొందిన తపన ప్రతికవితలోనూ ప్రత్యక్షమౌతున్నది. కవిసృష్టి, సహనదరహాసం, నవకాంతి కిరణాలు, నవకవిత, కవితాదీపాలు-కవితనుగూర్చి కవయిత్రికున్న భావాన్ని చిత్రిస్తున్నాయి. 'అరుణకిరణాలు' వేరువేరు కవితలను చేర్చికూర్చిన సంపుటి. అయినప్పటికీ, ఒక్కటే భావసూత్రం తొలికవితనుంచి తుదికవితదాకా అనుస్యూతంగా అంతర్గర్భితంగా ఉంది. ఆవిధంగా ఈగ్రంథం ఆద్యంత సమన్వయాన్ని సాధించుకుంది.

మేడలు, మహాజ్వాల మొదలయిన రచనలు ప్రతీకాత్మక కవితకు ప్రతినిధులు.

సూక్తులవంటి పంక్తులు ఈసంపుటిలో కోకొల్లలు. కొన్నింటిని చూద్దాము—

'లోకమంతా మెచ్చినా
భర్త మెచ్చని ఆడది

లోకానికి వెలి, సంఘానికి బలి'

'ఇది ఏనాగరికత పూసినపువ్వు
ఇది ఏనాగరికత పండించిన పంట
వలువలు మార్చినంత సులువుగా
విలువలు విసర్జించేస్తారు'

'దోపిడీలకీ ఆడంబరాలకీ ప్రాముఖ్యం
అంతరంగానికీ ఆశయాలకీ వైముఖ్యం
కొందరికి చదువకుండా డిగ్రీలు కావాలి
కొందరికి కష్టించకుండా పదవులు రావాలి'

'ఉత్తరాయణానికి ఆప్తులులేక
దక్షిణాయనానికి ఆస్తులు లేక'

'తిరగలిలా తిరగకండి
తిరుగుబాటు చెయ్యండి'

'ఉత్సాహం, ఉద్వేగం తరగనిఆస్తి
సాహిత్యం సంతోషం ఆరనిజ్యోతి'

ఇలా చెప్పుకుంటూపోతే చాలా చెప్పాలి. పుస్తకం మీచేతుల్లో ఉంది. మీరే చూడండి.

'ఆమేధావుల మెదళ్ళలోని సూర్యోదయాలు
దేశంలోనే వెలుగులు చిందించేరోజు
అధికారులదోపిడి అంతమయ్యేరోజు
నా జాతి నిండుగా వికసించేరోజు
నాకలంగీసే గీతల్లో
రూపుదిద్దుకుంటోంది ?

అన్న దృఢవిశ్వాసంతో కవయిత్రి కలంచేతపట్టారు. ఆసంకల్పంతోనే కవితలకు రూపుదిద్దారు. 'కళ కళకోసమే' అన్నసిద్ధాంతానికి శ్రీమతి పార్వతి ప్రతిస్పర్థి. సృష్టిలో ప్రతి దానికీ ప్రయోజనమున్నప్పుడు ఉత్కృష్టమైనకళకు ప్రయోజనం లేదనడం సరిపడని సంగతి. సమాజాన్ని సరిదిద్దడమూ, సామూహిక చైతన్యాన్ని సవరించడమూ ఉత్తమకళవల్లనే సాధ్య మవుతుంది. ఉత్తమకళ ఉత్తమసంస్కృతికి ఉద్భవ స్థానం.

అందంగా విరచించడమూ, ఆనందం కలిగించడమూ కవికి ప్రధానకర్తవ్యం. ఈకర్తవ్యాన్ని నిర్వహిస్తూనే ప్రయోజనాన్ని సాధించుకోవడం కవి ప్రయోజకత్వానికి నిదర్శనం. కవయిత్రి శ్రీమతి పార్వతి సత్యశివ సుందరాత్మక మైన తమ కవితాత్మను సముజ్జ్వలంగా ఆవిష్కరించి, చరితార్థతను సాధించుకున్నారు.

"అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా ఽమృతం గమయ"



# నా మాట

బాధల్లోంచి ఆవేదనల్లోంచి
కవిత జన్మిస్తుంది
అన్యాయాల్ని అక్రమాల్ని
కవిత ఘర్షిస్తుంది

కవిదృష్టి కాలంకన్నా ముందుంటుంది
కవిసృష్టి లోకంకన్నా విశాలమైంది
పసితనపు అమాయకత్వం
కళ్లలో మాయకముందే
లేతబుగ్గల పాలమెరుపులు
కరిగిపోకముందే
పేదవారై పుట్టిన నేరానికి
పొలాల్లోనూ పొరుగిళ్లలోనూ
వయసుకిమించిన చాకిరిచేస్తూ
బతుకీడుస్తున్న అభాగ్యుల్నిచూసి
కవికలం ఘోషిస్తుంది !

ధర్మమూర్తులుగా పేరుపొందినవారు
పెద్దమనుషులుగా అందలా లెక్కినవారు
న్యాయాన్నీ ధర్మాన్నీ
నడివీధిలో జుట్టుపట్టుకుని ఈడుస్తుంటే
కళ్లుమూసుకుని తలుపులేసుకున్న
పిరికివాళ్లని చూచి
కవిత నిర్భీతిగా విమర్శిస్తుంది !

ఒక అభాగ్యుడికి న్యాయం కల్గించడానికి
ఒక అమాయకురాలికి తావు కల్పించడానికి
ఒక పేదవాని జీవితాన్ని నిర్మించడానికి
ప్రాణాలను పణంగా పెట్టిన వీరుణ్ణిచూచి
కవిత జయజయధ్వానాలు చేస్తుంది!
మారణాయుధాలతో మనుష్యుల నంతంచెయ్యని
ప్రపంచంకోసం
శ్రమదోపిడిలేని మానవతవికసించే ప్రపంచంకోసం
జాతిభేదం వర్గభేదం లేని సర్వసమాన ప్రపంచంకోసం
కవిత నిరంతరంగా కృషిచేస్తుంది.

— మీా రచయిత్రి.

# విషయ సూచిక



# అరుణకిరణాలు

అరుణకిరణాలు!
జగత్తంతా,
అందంగా ఎర్రనికాంతితో మెరిసిపోతూ
తనువుల్నీ మనసుల్నీ ఉత్తేజితంచేసి
నవోత్సాహాన్ని కల్పించే
నవారుణ కిరణాలు!

ఇవి రేపటి
సమసమాజ సూర్యోదయ కిరణాలు!
విశ్వమంతా మైత్రీభావంతో పులకించిపోయింది
అందం ఆనందం అంతటా నాట్యం చేస్తున్నాయి
ఆడవాళ్ళ కళ్ళల్లో ఆవేదన తొలగిపోయింది
పేదవానిబాధలన్నీ తీరిపోయి
పీడితుని గాథలన్నీ చెరిగిపోయి
రోగార్తుని ఆక్రందన మాసిపోయి
పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రాబల్యం సమసిపోయి,
సమతారుణ రాగంతో
మమతారుణ రావంతో
విశ్వమంతా అమృతమయమై పోయింది.

పాతసమాజాన్ని కూకటివేళ్ళతో కూల్చి,
నవసమాజవృక్షాన్ని త్యాగారుణిమలతో పెంచిన
నూతనమానవుని విజయగాథల్ని
నేలమీద తరులు, గిరులు
నింగిలోని తారామణులు
నిరంతరం గానం చేస్తున్నాయి!

ఈ అరుణకిరణాలు ఏనాటికీ అస్తమించవు
ఈ సమతా సమాజం ఎప్పటికీ మారిపోదు.

# విమోచనాహ్వాన పత్రం

ఇది వనితావత్సరం
ఇది మహిళావిమోచన
మహోత్సవాహ్వాన పత్రం
బాధలతో భయాలతో
మానసికోన్మాదులు కాకండి-

చింతల్లో చీకట్లో
జీవచ్ఛవాలు కాకండి-
కులమతాల కోలాహలానికి

అధికారుల అహంకారానికి
మగవాళ్ళ ఆధిపత్యానికి
సమాజపు దౌష్ట్యానికి
బలిపశువులైంది మీరే!
మానహత్యలు పొందింది మీరే!

పుట్టినక్షణంనుండి పోయేక్షణందాకా
అడుగడుగునా ఆడదాన్ని అణిచే ఈ సంఘాన్ని—
రోగిష్టియైనా, శాడిస్టయినా
పిచ్చివాడైనా నపుంసకుడైనా

తాళి కట్టించుకున్న నేరానికి
చిత్రహింసలు విధించి వినోదించే ఈసంఘాన్ని —

ఆస్తిలో ఆధిపత్యంలో
విద్యలో వివేకంలో
మిమ్మల్ని కాలికింద తొక్కిపెట్టిన ఈ సంఘాన్ని
ఈవేళ ఎదిరించండి !
హెచ్చుతగ్గులులేని నవసమాజాన్ని నిర్మించండి !

ప్రతివనితా ఝాన్సీలక్ష్మిగ
ప్రతిమహిళా రాణీరుద్రమగ
పోరాటం సలపండి !

నూతులు గోతులు సమస్యని పరిష్కరించవు !
జపాలు తపాలు కష్టాల్ని నివారించవు !
సమిష్టిపోరాటమే సమస్యాపరిష్కారం !
సమిష్టిచైతన్యమే తక్షణకర్తవ్యం !

# విరిసిన గులాబీలు

కన్నెపిల్ల పువ్వులాంటి గుండెలో
కట్నాలకంటకాలు గుచ్చుకుని
వయసూ, తనువూ రక్తసిక్తమైపోతున్నాయి—

మధురవసంతంలాంటి సంసారాన్ని
స్త్రీ పురుష న్యూనతాధిక్యతలతో
వెయ్యిముక్కలుగా చీల్చుకుంటూ
చీలికల చీకట్లమధ్య
జీవితాన్ని వెతుక్కుంటున్నారు దంపతులు—

నిర్మలంగావిరిసే గులాబీల్లాంటి
బాలబాలికల మనస్సుల్లో
వర్ణవిభేదాల మూఢవిశ్వాసాల మత్తుమందు చల్లి
భావితరాన్ని అజ్ఞానులుగా సంకుచితులుగా
రూపొందిస్తున్నారు!

ఈకట్నాల కంటకాలు జనించే
మూఢవిశ్వాసాలు పెంపొందించే
బూర్జువావిలువల్ని దహింపజెయ్యాలి!
సమాజాన్ని సంస్కరించి
సమతామానవతల్ని విరియించాలి!

# మేడలు

గుడిసెల్లో ఆకలిదప్పులుంటాయి జైళ్ళుండవు
మేడల్లో జైళ్ళుంటాయి
జైళ్ళల్లో అందమైన లేళ్ళుంటాయి
లేళ్ళఅందం ఎవరికంట పడకుండా
మేడలు అనుక్షణం పహరా ఇస్తుంటాయి
మేడలకి అహంభావం అంధకారం మూలస్తంభాలు
కుహనామర్యాదల పునాదులు

మేడల్లోకి
రెండునాలికల నాగరాజులు
జిత్తులమారి గుంటనక్కలు
మేకవన్నె పెద్దపులులు
నిరాటంకంగా ప్రవేశిస్తాయి
ముందర ముఖస్తుతులు చేసుకుంటాయి
వెనకాల గోతులు తవ్వుకుంటాయి

మేడలకి రాత్రంటే భయం
రాత్రివేళ చల్లని శాంతికపోతం
దరహాసనేత్రాంచలాలతో పలకరిస్తే
కాలసర్పం కాటేసినట్లు బెదరిపోతాయి

మేడలు శాంతిని కాంతిని తరిమేస్తాయి
మేడలు నల్లధనాన్ని సృష్టిస్తాయి
కరువు కాటకాల్ని పెంపొందిస్తాయి
మేడలూ మేడలూ ఊళ్ళేలుతాయి
మేడలూ మేడలూ జనాన్ని దోచుకుంటాయి

గుడిసెల్లో ఆకలిదప్పులుంటాయి జైళ్ళుండవు—
గుడిసెల్లో కాయకష్టం, ఐకమత్యం ఉంటాయి
బాధలుండవు—

గుడిసెల్లోని ఆకలిదప్పులు నివారించేందుకు
మేడల్లోని అన్యాయాల్ని అక్రమాల్ని అణిచివేసేందుకు
ప్రభుత్వం కృషి చేస్తోంది
జనత సహకరిస్తోంది.

# మహాజ్వాలి

భూమంతా పరచుకున్న
అందమైన అమాయకమైన వృక్షాలు
ఒకనాటి అరుణోదయాన సభతీర్చాయి

జామి, అరటి, సీతాఫలం
మామిడి, పనస, నారికేళం
వందల వందల వృక్షాలు

బంధింపబడ్డ ఉద్యమవీరుల కనుసైగల్లో
తుపాన్లు వీచినట్లు
కొమ్మలన్నీ అసహనంతో వీస్తూ
పెనుఝంఝుని సృష్టిస్తున్నాయి.

మామిడిచెట్టు ఇలాఅన్నది—
"ప్రతివారికీ మనం మేలుచేస్తున్నాం
అందరూ మనకి కీడు చేస్తున్నారు
నారక్తమాంసాలు కరగించి, పళ్ళుకాసి
నా యజమానికి
అనంతంగా ధనం గడించిపెట్టాను

ఎండకి ఎండి
వానకి తడిసి
బానిసనై ఉన్నచోటనే పడిఉన్నాను
ఈనాడు నాకు కాపు లేదని
నాయజమాని నన్ను నరికేయమంటున్నాడు
మనశ్రమను దోపిడిచేసే
యజమానులంతా
మానవులు కాదు — మహారాక్షసులు !"

వెంటనే అరటిచెట్టు అంది—
"పచ్చసి నాజీవశక్తి నర్పించి గెలలు కాస్తాను
నాగెల కోసుకుని అనుభవించిన యజమాని
నాముఃఖం చూస్తేపాప మని
నిలువునా నన్ను కూల్చేస్తాడు !

తనసుఖానికి శక్తినర్పించేవారిని
అంతంచేసే ఈమానవులు
భయంకర మృగాలు !"

తరతరాల భోగవస్తువు
మాధవీలత గర్జించింది !
"మాలో మధువు లున్నంతకాలం
మాయమాటలు చెప్పి అందాల్ని దోచుకుని
అవసరం తీరినతర్వాత
మరో అందంకోసం మరలిపోతాయి మధుపాలు !

మానవ్య క్తిత్వాన్ని
తమ నిరంకుశత్వంతో మట్టుపెట్టే
ఈ నియంతల దురధికారం
అంతమయ్యే వాతావరణాన్ని కోరుతున్నాం !
అందుకోసం వికసించే ఉద్యమాల్ని ఆహ్వానిస్తున్నాం !"

పీడితసోదరుల ఉద్యమదీప్తిలా ఊగిపోతూ
మామిడిచెట్టు మళ్ళీపలికింది।
"ఆహారాన్ని ఉత్పత్తిచేసే మనం
అంధకారంలో అల్లాడుతున్నాం।
కర్రలతో కొట్టినా
గొడ్డలితో నరికినా
యింతకాలం ఎదురుతిరగలేదు
మనముద్దుపాపల్ని మననుండి వేరుచేసినా
కుమిలి కుమిలిపోవడం తప్ప
ఘోష పెట్టలేకున్నాం !
ఈరోజు న్యాయం, నీతి, ధర్మం
అన్నీ బలవంతులకే బానిసలు
మనబ్రతుకుమీద మనకి స్వతంత్రంలేదు
మనం మరణిస్తే
మనసంతానానికి భద్రతలేదు
వాళ్ళకు దయపుడితే
గుక్కెడునీళ్ళు మనగొంతున పోస్తారు
లేకపోతే వర్షంనీటిలోనే మనఅష్టకష్టాలు !

ఈ బానిసత్వంలోంచి
ఈ అస్వతంత్రతలోంచి
ఈ అంధకారంలోంచి
నిప్పుగాలి వీచాలి
మహాజ్వాల రేగాలి

మనలో గర్భితమైనశక్తి మనం గుర్తించలేకున్నాం !
మనకొమ్మలు రాచుకుంటే దావాగ్ని రగుల్తుంది
ఈదోపిడివ్యవస్థని తగులబెట్టి
సమవ్యవస్థని నిర్మిస్తుంది !"

వెంటనే ఆవేశంతో ఊగిపోతూ
నారికేళం గర్జించింది.
"తరతరలుగా మనం తలదాలుస్తున్న ఈఅన్యాయాలు
ఇక కొనసాగడానికే వీల్లేదు
మనం జడత్వాన్ని చీల్చుకుని
సంకెళ్ళు తెంచుకొని
వేయిచేతులతో వేయికాళ్ళతో విజృంభించి
సంఘటితపోరాటాన్ని కొనసాగించాలి
తక్షణమే దీర్ఘసమరానికి ఆయత్తులం కావాలి !"

చెట్లన్నీ వీరావేశంతో ఊగిపోయాయి
కొమ్మకొక పెనుఝంఝుని సృష్టిస్తూ
వేలు లక్షలు కోట్లు
భూమినీ ఆకాశాన్నీ కప్పేస్తూ

కదనరంగంలోకి ఉరికాయి !
మెత్తని వళ్ళు గండశిలలై పిడుగులుగా వర్షించాయి
చిగురాకులు ఈటెలై శత్రువుగుండెల్లో కురిశాయి
మృదువైనతీగలు ముళ్ళతీగలై
పగతురకంఠాలకి ఉరితాళ్ళుగా మారాయి
పీడిత తాడిత జనులు లేని కొత్తసృష్టికోసం
ప్రాణాలకి తెగించి పోరాటాన్ని ప్రారంభించాయి—

దోపిడిశక్తుల్ని గుర్తించి నిద్రలేచినప్పుడు
పీడితవర్గాలన్నీ మహాజ్వాలలై జ్వలిస్తాయి !
దుష్టశక్తుల్ని తుదకంటా దహించివేసి
స్వర్ణయుగద్వారాల్ని తెరుస్తాయి !

# ఉజ్వల సమాజం

లోకమంతా మెచ్చినా
భర్త మెచ్చని ఆడది
లోకానికి వెలి, సంఘానికి బలి
తల్లికీ – తండ్రికీ బరువు
ఆమెకి ఆదరణే కరువు

భర్త మరణిస్తే
హృదయవిదారకంగా ఏడుస్తున్న ఆడదాన్ని
కాళ్ళు చేతులూ కట్టేసి
సజీవంగా మంటల్లో పడవేసిన
ఘోరమైన మనుష్యులం మనం !

ఈ వేళ సజీవదహనాలు లేవు—
కాని, మనస్సుని దహించివేస్తున్న కాపురాలు అసంఖ్యాకం !
శృంగారాన్ని ఆశించి
దాంపత్యంలో అడుగుపెట్టిన సుదతికి
అంగారం ఎదురైతే
ఆమంటలనుంచి రక్షణకోసం
న్యాయస్థానానికి పరుగెడితే

ఆత్మగౌరవానికి హానికల్గించే ప్రశ్నలతో
నిలువునా దహించి వేస్తారు—
వివాహం చేస్తే
ఆడపిల్లబరువు తీరిందనుకున్న తలిదండ్రులు
స్త్రీకి ఆస్తి, చదువు
అనవసరం అనుకునే సామాజికులు
భర్తవదిలేసిన స్త్రీ
వ్యర్థం అనుకునే సంఘం
భార్యాభర్తలు విడిపోవడం
మహానేరం అనుకునే సమాజం
మారాలి— మారాలి—
న్యాయమైన ప్రజాకోర్టులు
సరిపడని దాంపత్యాన్ని సులువుగా పరిష్కరించాలి
ఆ భవిష్యదుజ్వలస్త్రీ పురుషసమతాసమాజంకోసమే
పోరాడాలి !

# దీక్ష

ఇది దీక్ష
ఎన్నటికీ విడువరాని ఏకైకదీక్ష
అపజయాల నెదిరించి
అడ్డంకుల నధిగమించి
కొనఊపిరి ఆడేదాకా
పోరాడే దీక్ష— ఇది ఏకైకదీక్ష—

అమాయకుల ఆక్రందన
అభాగినుల కంటినీరు
పసిపాపల రోదనలు
మందులేక తిండిలేక
మరణించే అభాగ్యులే
మానవాళియొక్క గోడు
అంతరింపజేయు దీక్ష— ఇది ఏకైకదీక్ష—

పెత్తందారివ్యవస్థలోని చీడమొక్కల్ని
సమూలంగా పెరికివేసి
పుడమితల్లి కడుపులో సమతల మమతల
నవధాన్యాలు నాటి

సామ్యవాదసిద్ధాంతపు అమృతజలాలు జల్లి
సమిష్టికృషి అనే ట్రాక్టర్లతో దున్ని
సమసమాజపు పంటల్ని అక్షయంగా పండించేందుకు
ప్రతినపూనిన దీక్ష— ఇది ఏకైకదీక్ష—
అర్థానికి, స్వార్థానికి
బతుకులు బలిచెయ్యని సమాజంకోసం
అర్థరాత్రి ఒంటరి ఆడదానిమీద
తుంటరితనం సాగించని సంఘంకోసం
అబద్ధపుసాక్ష్యాలు, అన్యాయన్యాయస్థానాలు
అంతమయ్యే దేశంకోసం
మంచినీ, మానవతనీ
దానవత్వం హత్యచెయ్యని ప్రపంచంకోసం
విరమించబోని దీక్ష— ఇది ఏకైకదీక్ష—
కష్టించి పనిచేసేవాళ్ళ కడుపు నింపేందుకు
పరదాలలో మూలిగే స్త్రీజాతిని మేల్కొలిపేందుకు
జాతిని అభ్యుదయపథంలో నడిపేందుకు
బ్లాక్ మార్కెటింగ్ ని లంచగొండితనాన్ని అంతంచేసేందుకు
పట్టిన ఏకైకదీక్ష—
ఇది దీక్ష—

# ఆధునిక నాగరికత

ఇది ఏనాగరికత పూసినపువ్వు
ఇది ఏనాగరికత పండించినపంట
వలువలు మార్చినంత సుళువుగా
విలువలు విసర్జించేస్తారు !

దోపిడీలకీ ఆడంబరాలకీ ప్రాముఖ్యం
అంతరంగానికీ ఆశయాలకీ వైముఖ్యం
కొందరికి చదవకుండా డిగ్రీలుకావాలి
కొందరికి కష్టించకుండా పదవులురావాలి
ఇద్దరికీ ఉంది రాజమార్గం !
లంచాలు ఇవ్వడం, కాకాలు పట్టడం
పైవాడు కిందవాడిమీద
వాడు, తనకన్నా క్రిందివాడిమీద
అధికారం చలాయిస్తున్నారు !
లోపల తిట్టుకుంటూ
పైకి ఒంగిఒంగి దణ్ణాలు పెడుతుంటే
తమ గొప్పతనాన్ని అహంకారంతో
హెచ్చు చేసుకుంటున్నారు

పెద్దపెద్ద పట్టణాల్లో
ఖరీదైన హోటళ్ళలో

మద్యంమత్తులో తేలిపోతూ
అందమైన అమ్మాయిలు
అంగాంగ ప్రదర్శనలతో నాట్యంచేస్తుంటే
హొయలు చూపిస్తూ
ఒంటిమీది ఆఖరివలువలుకూడ విసర్జిస్తుంటే
ఒళ్ళంతా కళ్ళుచేసుకుని వీక్షిస్తూ
ఆ మదవతుల పరిష్వంగంలో సోలిపోవడం
నేటి నవనాగరికతకి పరాకాష్ఠ !
నల్లమందు సిషాలో
నల్లడబ్బు హుషారులో
మానవత్వపు కనీసపు మర్యాదల్నికూడ మంటగలుపుతూ
స్వేచ్ఛపేర విశృంఖలంగా తిరగడమే
నేటి నవనాగరికత !

కొందరి అజ్ఞానంమీద
మరికొందరి శరీరశ్రమమీద
బ్రతుకుతోంది నేటి నవనాగరికత—
ఈ నాగరికతలో
బలవంతుడు బలహీనుణ్ణి నిలువునా దోస్తాడు
కంచే చేనుని మేస్తుంది !
మంచి మానవత మరుగున పడిపోయి
అర్థకామాలు ప్రాధాన్యం వహిస్తున్న
ఈ ఆధునిక నాగరికత పండించినపంట—

హత్యలు !
దోపిడీలు !
మానభంగాలు !
తీవ్రవ్యాధులు !
హఠాన్మరణాలు !
ఈ కుహనానాగరికత మూలకారణాల్ని కూల్చి
ఈ ఆర్థికసంస్కృతిని పునాదులతో పెళ్ళగించి
సమతావ్యవస్థను స్థాపించాలి
సమధర్మాన్ని విరియించాలి !

# ఆహ్వానం

పవిత్రమైనది విప్లవం
స్వార్థరహితమైనది విప్లవం
తమకోసం చీమనైనా హింసించని విప్లవవీరులు
అన్యాయాల్ని అక్రమాల్ని ఎదిరించడానికి
భీకరపోరాటాలు సాగిస్తారు !

సామ్యవాదసిద్ధాంతం విప్లవానికిమూలం
జీవితంలోనించి సామ్యవాదం జనిస్తుంది
సృష్టిసౌందర్యాన్ని, బ్రతుకువిలువను తెలిసినసామ్యవాది
వృథాగా నెత్తురు చిందించడు
ప్రకృతిని గతితర్కంతో అర్థంచేసుకుంటూ
సంఘటనలను చారిత్రకభౌతికవాదంతో పరిశీలిస్తూ
ఈసమాజాన్ని మారుస్తాడు

ప్రకృతిశక్తులు సామ్యవాదదేశాలకి బానిసలు
నైతికవిలువలు ఆదేశాల్లో వికసించిన పుష్పాలు
బలవంతులు బలహీనులను అణగద్రొక్కని ఆ సమాజం
ఒకరిశ్రమని మరొకరు దోచుకోని ఆ సమాజం
ఆరోగ్యం ఆనందం ప్రతిఒక్కరి కళ్ళలో ప్రతిఫలించే
ఆ సమాజం

విప్లవవీరుల అరుణత్యాగాల
వికసించిన మహోదయం !
వీరత్వం మానవత్వం లేనివారు
అవకాశవాదులు
అధర్మానికి నిలయమైనవారు
విప్లవవీరులు కాలేరు !
ఆచరణకు, త్యాగాలకు ఒరవడిదిద్దినవారిని
విప్లవం ఆహ్వానిస్తుంది !
విజయం చేకూరుస్తుంది !

# చరమరాత్రి

ఇది దీర్ఘరాత్రి
బ్రతుకే శూన్యమైన చరమరాత్రి
భయంకర కాళరాత్రి
దట్టంపుచీకట్ల అమవాస్యరాత్రి

వయసుకోరిన ప్రియుడు
మనసుమెచ్చిన వరుడు
కులాల వాదాలకో, కట్నాల భేదాలకో
పెద్దవాళ్ళ సద్దులకో
తలవంచి తప్పించుకున్న తరుణంలో
మనసుమెచ్చిన వరుడు
తనువుకోరని వరుడు
వివాహవేదికమీద బలిపశువుకంఠానికి
మూడుముళ్ళ ఉరిత్రాడు బిగిస్తుంటే
బ్రతుకే శూన్యమైన చరమరాత్రి
దట్టంపుచీకట్ల అమావాస్యరాత్రి—

ఆస్తినంతా పణంపెట్టి డిగ్రీనికొనుక్కుని—
డిగ్రీలోసాధించిన నిరుద్యోగం ఆకలిమంటల్ని రేపుతుంటే
ఆ మంటల్లో శరీరం సొమ్మసిల్లి

క్షణాలు యుగాలై కాలం పొగలు విడుస్తుంటే
ఇది దీర్ఘరాత్రి

ఉత్తరాయణానికి ఆప్తులు లేక
దక్షిణాయనానికి ఆస్తులు లేక
దారిద్ర్యాన్ని భరించలేక
ఎదురుతిరిగిన మనస్సుని పాతాళంలో కుక్కి
అధికారి కబంధహస్తాల్లో నలిగిపోయిన
యువతి బ్రతుకులో
దీర్ఘ రాత్రి
కాళ రాత్రి
అమావాస్యరాత్రి
చరమరాత్రి.

# కవిసృష్టి

ఇది రససృష్టి
హృదయాన్ని విశాలంచేసే కవిసృష్టి
మేధని వికసింప జేసే అభ్యుదయదృష్టి
ఈ రసమయజగత్తులో
మనస్సులోని నిరుత్సాహం నిర్వేదం తొలగిపోతాయి
హృదయంనిండా ఉత్సాహం ఉద్వేగం నిండిపోతాయి
దైనందిన సమస్యావలయంలో ఊపిరాడని
మానవాళికి శాంతి, కాంతి ప్రసాదిస్తుంది

ఏకాంతపు చీకటికోణాలనిండా
ఆనందపు వెలుగుదివ్వె అందిస్తుంది
మంచిమిత్రులు లేనికొరత
చుట్టపక్కాలు లేనివెలితి
పూరిస్తుంది—

చదువులు నేర్పని, పెద్ద లందివ్వని
సంస్కార మిస్తుంది—
ఆవేదన అనే హిమానీజలాల
తడిసి పునీతమైన కవితాగోదావరి
సహృదయుల మనోక్షేత్రాలమీద
పరవళ్ళుతొక్కుతూ ప్రవహిస్తుంది
ఆనందం పంటలను పండిస్తుంది.

# సహనదరహాసం

అనాడు ఈనాడు
ధనం పలుకుబడి ఉన్నవాళ్ళ
వాళ్ళ ఆశ్రయించినవాళ్ళ
రచనలే వెలుగుచూస్తున్నాయి
అవి లేనివాళ్ళ రచనలు
చీకటిలో మ్రగ్గుతున్నాయి—

నమ్మిన సిద్ధాంతాల్ని
తన ఆకలిబాధకి గురిచేయక
అడుగడుగునా ఎదురయ్యే అవమానాల్ని బాధల్ని
సహనదరహాసంతో ఛేదిస్తూ
మానవజాతి అభ్యుదయంకోసం
తన నెత్తురు తైలంగా
సాహిత్యదీపాన్ని వెలిగించిన రచయిత
తన రచనని చీకటిఅరల్లో దాచుకుంటున్నాడు—

ఆశ్రయింపులు అంకితాలు తెలియని రచయిత
అందరిగుర్తింపూ పొందేదెప్పుడు ?
నిరుపేదరచయిత ప్రతిభకీ ప్రగతికీ
న్యాయం చేకూరేదెన్నడు ?



4

# నవకాంతికిరణాలు

సాటిరచయిత ప్రతిభ చూడలేక
విషందాచిన చిరునవ్వుల్ని వెలిగక్కే
జిత్తులమారి మనస్తత్వాలు మారే రోజుకోసం—

న్యాయం, ధర్మం, అనురాగం, అభ్యుదయం రచనల్లోనింపి
ఆచరణలో అణువంతస్వార్థాన్ని వదులుకోలేని
వారిఆత్మలు పరిణతిచెందే రోజుకోసం—

రచయిత రచనల్లోవలెనే
మాటల్లో చేష్టల్లో శాంతి కాంతి వెల్లివిరిసి
ఈర్ష్యాద్వేషాలు దూరంగా విసిరి
జగత్తుని సాహితీరసామృతంలో
రాగమయంగా చేసేరచయిత ఆంతర్యం
ఋషి అంతరంగంలా అలరారే రోజుకోసం—

ఇక్కడ— ఈ తిమిరకోణంలో
వెయ్యికళ్ళు విచ్చి, వేచి చూస్తున్నాను—
రచనారంగంలో కాలుష్యం ప్రవేశిస్తే
మనస్సులు మలిన మౌతాయి—
మానవతా నవతాకాంతికిరణాలు ప్రకాశిస్తే
జగత్తుకి అంధకారం తొలగిపోతుంది.

# మీ గమ్యం తిరుగుబాటు

దగాపడిన కన్యలార
దోచబడిన గృహిణులార
అడుగు ముందు వెయ్యలేక
చీకటిలో అలమటించు
అక్కలార ! చెల్లెలార !
మీ బాట నిరాశకాదు
మీ గమ్యం చావుకాదు
మీ గమ్యం తిరుగుబాటు
మీ లక్ష్యం తిరుగుబాటు — ద —

గతంమీద మతంమీద
కర్మమీద కలలమీద
పోరాటం చెయ్యండి !
ఇంతకాల మణిచేసిన
చరిత్రనే చించివేసి
అరుణరక్తరేఖలతో
కొత్తచరిత రచించండి — ద —

మీ స్వేచ్ఛను మీ యిచ్ఛను
పెళ్ళికి బలిచేశారు

మీ క్షేమం మీ మోదం
విధికే వదిలేశారు
మీ బ్రతుకులమీద పరుల
అధికారం కూల్చండి !
మీ భావితరాలబాట
మీరే నిర్మించండి ! — ద —

మీ శక్తిని మీ యుక్తిని
చీకటిల్లు తినివేస్తే
జడత్వాన మరణంవలె
బ్రతుకుతున్న పడుచులార !
సమాజాన అభ్యుదయం
సమజీవన సౌందర్యం
సాధించగ నడుముకట్టి
అడుగు ముందు వెయ్యండీ
తిరగలిలా తిరగకండి
తిరుగుబాటు చెయ్యండీ ! — ద —

# నూతనకాంతి

దేశములో సమసమాజనిర్మాణముకై
భారతదేశములో సమసమాజనిర్మాణముకై
వెల్లువలా పెల్లుబికెను నూతనకాంతి
ఇది నూతనకాంతి ॥దే॥

ఆకులన్ని రెమ్మలన్ని
కొమ్మలన్ని పూవులన్ని
జీవశక్తి రగిలించెను నూతనకాంతి
ఫలములలో త్యాగాగ్నుల
జ్వాలలుగా వెలిగించెను నూతనకాంతి
ఇది నూతనకాంతి ॥దే॥

నిరుపేదల బ్రతుకులెల్ల
పచ్చగ ఫలియించక
పుడమిలోన సుఖశాంతులు
పున్నమిలా వెలయించగ
కొత్తజగతి నిర్మించెను నూతనకాంతి
ఇది నూతనకాంతి ॥దే॥

ఉత్పత్తిని పెంపుచేసి
సంపదలను వృద్ధిచేసి
మహిళల సంకెళ్ళు త్రెంచి
మానవతను విడవకుండ
కొత్తజగతి నిర్మించెను నూతనకాంతి
ఇది నూతనకాంతి ॥దే॥

# అరుణాంజలి

ఇన్నాళ్ళూ బ్రతుకు వృథా
బ్రతుకు వృథా అని తలచా
ఈనాడే బ్రతుకంటే
అర్థమేదో గ్రహియించా ॥ఇ॥

తనువంతా వయసంతా
యజమానికి ధారపోసి
ఎండలోన వానలోన
కాయకష్టము చేసి
ఆయువు ఆరోగ్యాలే
ఆఖరై పోవగా
కంటనీరు కారుస్తూ
బ్రతుకు నెత్తురోడుస్తూ ॥ఇ॥

తిరుగుబాటు బ్రతుకునకొక
కొత్త వెలుగు చూపింది
బానిసలై బ్రతుకవద్దు
మరణానికి వెరువవద్దు
దోచుకునే దొరల అంతు
చూచేకాలము వచ్చేను

పోరాటమె మనధ్యేయం
తిరుగుబాటు మనలక్ష్యం ॥ఇ॥

దేశమాత చెరనుబాపె
నిరుపేదలవైపు నిలిచి
సమతను సాధించుటకై
నెత్తురెల్ల ధారపోసి
ప్రాణంబుల నర్పించిన
అమరవీరుల కెవ్వడు
అరుణాంజలి ఘటియింతము
వారిబాటలోన నిలిచి
పోరాటము సాగింతము ॥ఇ॥

# విమోచన

మధ్యతరగతి మహిళలారా
మిధ్యాగౌరవాల కుహనామర్యాదల
రాస్తాలో కొట్టుకుపోతూ
తరంనుండి తరానికి
అర్థంలేని ఆచారాల్ని
అంతుదొరకని సంప్రదాయాల్ని అందిస్తూ
భవిష్యత్తుని అంధకారంలో ముంచివెయ్యకండి !

విరామసమయాల్ని వీధిఅరుగులకి అంకితంచేసి
ఇరుగుపొరుగులను ఆక్షేపిస్తూ
మీలోమీరు కలహించుకుంటూ
నూతిలోని కప్పల్లా కాలం గడిపెయ్యకండి !
అబ్బాయిల్ని అమ్మాయిల్ని వేరువేరుగా చూస్తూ
కోడళ్ళనీ కూతుళ్ళనీ భేదాలెంచుతూ
చీరసారెలే జీవితపరమార్థమని
నగలూ నాణ్యాలే గౌరవానికి కొలబద్దలని
ఎంచకండి !

మన దేశంలో అందరికన్నా ఎక్కువశ్రమించేది
దోపిడికి గురిఅయ్యేది
ఒక్క స్త్రీయే !



శ

మీ శ్రమకు గుర్తింపు లేదు
మీ జీవితానికి విలువ లేదు
పురుషులకు భోగవస్తువులు మీరు
కష్టాలకీ కన్నీళ్ళకీ ఆటపట్టు మీరు
ఈ అన్యాయాల్ని ఎదిరించండి—
స్త్రీజీవితాన్ని మేల్కొలపండి—
ఈ బానిసత్వానికి విమోచన పలకండి.

# పరువుమర్యాదల శూలాలు

ఉరిశిక్షలు రద్దు కావచ్చు
ఆసన్నమృత్యువు అడుగు వెనక్కి వెయ్యవచ్చు
ఈ దేశంలోని సాంప్రదాయిక వివాహాలుమాత్రం
ఆహావాలై
నిండుజీవితాన్ని
రక్తపుటేర్లు పారించినా రద్దుకావు !
యువతీయువకుల
మనసులు, మమతలు కలవక్కరలేదు
జాతకాలు కలిస్తే
ఆస్తులు పిలిస్తే
పీటలమీద బలవంతపు మూడుముళ్ళు
ప్రత్యక్షమాతాయి యిక్కడ !
జానెడు పొట్టకోసం, మూరెడు గుడ్డకోసం
మాంగల్యపు ఉరిత్రాడును ఛేదించలేరు
ఈ దేశపు బానిసలు !

ఘోర నేరాలుచేసి తప్పించుకొన్న గూండాలకు
చోటుంది ఈసమాజంలో
వైవాహికజైలునుండి తప్పించుకొన్నస్త్రీకి
చోటులేదు —

పరువు మర్యాదల శూలాలతో
ఆమెని తూట్లుపొడిచి
గుక్కెడు గంజికీ బుక్కెడు నీళ్ళకీ కరువుచేసి
అవహేళనల తాళ్ళతో కట్టి
అపవాదుల రాళ్ళురువ్వి
కారేరక్తాన్ని తాగి
కహాకహీ నవ్వుకుంటారు మర్యాదస్తులు
ఈ చిత్రహింసలకి లొంగిపోక
ఎదిరించి పోరాడాలి !
బానిసలైన స్త్రీలలోంచి పెనుఝంఝు లాంటి
తిరుగుబాటు జ్వలించాలి —
ఈ అంతర్జాతీయ మహిళాసంవత్సరంలో
భవిష్యదుజ్వలసమాజం రూపుదిద్దుకోవాలి !
(ఆకాశవాణి విజయవాడ సౌజన్యంతో.)

# వేయి కళ్ళతో

ఒకయిల్లాలు మిత్రునితో
నవ్వుతూ మాట్లాడినా
ఒకకన్నెపిల్ల స్నేహితునితో
చనువుగా మసలినా
అర్థాలు, అపార్థాలు
వాదులు, అపవాదులు
వేసే సమాజమిది.

వివాహానికి ముందే
పొరపాటునో గ్రహపాటునో
కాలుజారిన యువతిని,
మాతయైన సుదతిని
మాటలతో చేష్టలతో
చిత్రహింసల పాలుచేసి
ఆత్మహత్యకి పురికొల్పే
సంఘం మనది.

తనభార్య పాతివ్రత్యాన్ని
పదిలంగా కాపాడుకుంటూ
ఇతరస్త్రీలకు సెక్సస్వేచ్ఛ లేదని

గొంతుచించుకుని వాపోయే
ఆధునిక సంప్రదాయకులున్న దేశం ఇది!

వాడు మరణించినా
వాడిభార్యశీలం కాపాడాలని
బొట్టుచెరిపి, పూలుపీకి
అలంకారాలు పారేయించి
ఇదిచాలక ఆమె ఎదురైతే
అపశకునమని వాడలగొట్టి
ఆమెను భయం భయంగా
వెనుక వెనుక నుంచోబెట్టిన సమాజం మనది!

మగవాడి శీలానికి భంగం లేదు
ఆడదాని శీలానికి పట్టింపులు
శీలంపేర బానిసత్వాన్ని
సిగ్గుపేర అధమత్వాన్ని
వెయ్యిశాఖలుగా పెంపొందింపచేసిన
ఈ సంప్రదాయవృక్షపు వేళ్ళు పీకడానికి
పురోగమిస్తోంది ఈనాటి మహిళ!
ఆమె ఊపిరిలో తిరుగుబాటు చెలరేగి
ఆమెకార్యదీక్షలో సమతాసూర్యోదయం జరుగుతుంది!

(ఆకాశవాణి విజయవాడ సౌజన్యంతో.)

# కాంతిరేఖలు

ఆకలి మంటల్లోంచి
విప్లవజ్యోతులు వెలుగుతాయి —
బాధల బడబాగ్నుల్లోంచి
నలుమూలలా అల్లుకుంటాయి —
ఆకాంతుల్లో తూలితమైన సమాజంలో
ఫ్యూడల్ బూర్జువాసంస్కృతి
పూర్తిగా సమసిపోతుంది —
మానవతానాశకమైన ధనికవాదం మాసిపోతుంది —

కర్మసిద్ధాంతం కాలిపోయి
మూఢవిశ్వాసాలు కూలిపోయి
హేతువాదం, నీతీ న్యాయం
వేయి రేకులుగా వికసిస్తాయి —

విప్లవం
పీడితప్రజల ఆశాకుసుమం
విప్లవం
శ్రామికజనుల అంతిమధ్యేయం
సమసమాజంకోసం
విప్లవించే
నరనారుల జీవితాలు
ఎన్నటికీ ఆరిపోని కాంతి రేఖలు

# నిగళాల్ని ఛేదించుకుని

ఇల్లే ఒక జైలుగా
జీవితమే చిత్రహింసగా
చెయ్యని నేరానికి శిక్ష ననుభవిస్తున్న
ఓ నారీమణులారా !
మీ చెర వీడుతుంది !
మీ వ్యథ తీరుతుంది
వస్తోంది విప్లవశక్తి — మహిళా విప్లవశక్తి
మీ కష్టాలు, మీ నష్టాలు
ఈ ధనస్వామ్యవ్యవస్థ ప్రతిబింబాలు

'పురుషుని ఆనందంకోసమే ఆడది
ఆడదంటే ఆభరణాల బొమ్మ
చీరసారెలే ఆమె జీవితపరమార్థం
తిట్టినా కొట్టినా కాళ్ళవద్దపడిఉండే శునకం!"
అని తలపోసే మూఢులకాలం చెల్లింది —

జైలుగోడల్ని బద్దలుకొట్టుకుని
నిగళాల్ని ఛేదించుకుని
మహిళాలోకం విప్లవానికి అండగా నిలుస్తోంది
ఈ బూర్జువాసమాజం పునాదుల్ని
భస్మీపటలం చేస్తుంది !

నిగళాల్ని ఛేదించుకుని

మానవులు మానవులుగా మనగల్గే సమాజంకోసం
మానవత వెల్లివిరిసే సంఘంకోసం
విశ్వమానవ శాంతికోసం
ప్రాణాలకు తెగించి పోరాడుతుంది!

# సమాజసుందరి

తల్లిదండ్రుల శిక్షణకు కరువై
విద్యావినయాలకు వెలియై
దారిద్ర్యానికి గురియై
సమాజానికి బలియై
బ్రతుకు తెరువుకై బలవంతంగా
దొంగలు హంతకులైన యువనేరస్థులు —

ఆకలిమంటలు నిలువెల్లా దహించి వేస్తుండే
నిరాశ్రయురాలికి
సమాజం చూపించిన బాటలో
అందమైన శరీరాన్ని అడ్డమైనవాళ్ళకి అప్పజెప్పి
భయంకర రోగాలతో కుళ్ళిపోతూ
కళ్ళుకాళ్ళు లేని పిల్లల్నికంటున్న వెలయాళ్ళు—

పస్తులుండి చదువు చెప్పించి
డిగ్రీపొందిన అబ్బాయికి ఉద్యోగందొరక్క
తల్లిదండ్రుల ఆశలు నిరాశలుకాగా
నిస్పృహతో నిట్టూరుస్తున్న నిరుద్యోగులు—

వృద్ధాప్యం ముంచుకు రాగా
తీవ్రవ్యాధులు తరుముకు రాగా

ఆహారానికీ ఆప్యాయతకీ నోచుకోక
పీడించే వ్యాధులకి వైద్యం లేక
క్షణక్షణం మృత్యుదేవతని ఆహ్వానిస్తూ
దయనీయంగా బ్రతుకీడుస్తున్న అనాథజీవులు—

వీరందరూ,
పైపై మెరుగులతో, అలంకారాలతో మెరిసిపోతున్న
ఆధునికసమాజసుందరి నొసటిపైన
చిన్నప్పుడుకాల్చిన వాతంమచ్చలా
నల్లగా వికృతంగా కనిపిస్తున్నారు!
ఈమచ్చల్ని పైపైమెరుగులు కప్పలేవు—
కృత్రిమఅలంకారాలు దాచలేవు—

ధనస్వామ్యవ్యవస్థలోని హెచ్చుతగ్గుల్ని
ఈ వికృతపు మచ్చల్ని
రూపు మాపాలి!
ఈ వ్యవస్థ పునాదుల్ని
కూల్చివెయ్యాలి!
సమతాసమాజ నిర్మాణకృషిలో
ప్రతిఒక్కరూ శ్రామికులు 'కావాలి'!

# వికసించే కుసుమాలు

తరతరాల ధనికవాదమన స్తత్వం పేరుకుపోయి
కులతత్వం, కలతత్వం పాతుకుపోయి
ప్రాణంకన్నా, మానంకన్నా
ధనాన్నే మిన్నగా చూసుకునే
వాళ్ళు కొందరున్నారు
వీళ్ళ యిళ్ళలో
పిల్లల్ని పెంచడం తల్లులకి నామోషీ
తల్లులకి సేవచెయ్యడం పిల్లలకి అవమానం
తల్లీకూతుళ్ళ అనుబంధాలమధ్య
అక్కా–చెల్లెళ్ల అభిమానాలమధ్య
ఆస్తులు, అంతస్తులు ముళ్లబాటలు పరుస్తాయి—

అన్నదమ్ముల రక్తబంధాలు
ఆస్తిసంబంధాల ఖడ్గాలచేత
ఖండఖండాలుగా చీల్చబడతాయి—

శ్రామికులకి
అపేక్షలూ, అంతఃకరణలే ఆస్తి
ధనవంతుల
అపేక్షలూ, అంతఃకరణాలూ ఆస్తులే!
కార్మికస్త్రీలకి

స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు సిగలో వికసించే కుసుమాలు !
కలవాళ్ల స్త్రీలు
పురుషుల యినప్పెట్టెల్లో మగ్గిపోయే ఆభరణాలు !
తండ్రికుదిర్చిన యిష్టంలేని మనువుకీ
భర్త వ్యసనలోలుడై పెట్టేహింసకీ
స్త్రీ బ్రతుకు ఒక 'బలిపీఠం' !
స్త్రీని దాచిన బంగారుపంజరానికి
తాతముత్తాతల హోదాలు అంతస్తులే విరచరాని ఊచలు !
ఈవిషవలయాల్ని ఛేదించలేక
పూర్వకర్మ విశ్వాసాంధకారంలో
మనసు మరుగుపరచుకొని
సహనమనే చేతగానితనాన్ని
నిరంతరంగా సాధిస్తున్నారు స్త్రీలు !

అవసరాన్ని మించి పేరుకున్న ఆస్తి
మానవత్వాన్ని మంటగలిపి
దానవత్వానికి దారితీస్తుంది !
అక్రమంగా ఆస్తులు పెంచే అమానుషత్వాన్ని
అశ్రమంగా శ్రమనుదోచుకునే రాక్షసత్వాన్ని
అతితీవ్రంగా ఎదుర్కొని నేలగూల్చాలి !
అందరూ సమానంగా జీవించే వ్యవస్థను నిర్మించాలి !

# ఉదయరాగపు గులాబీలం

ఉత్సాహం ఉద్వేగం తరగనిఆస్తి
సాహిత్యం సంతోషం ఆరనిజ్యోతి
అన్యాయాల కంటకాలు
అక్రమాల పల్లేళ్లు
మా బాటకి అడ్డుతగిలి
అడుగడుగునా హింసిస్తున్నా

భీకరమైన రోగాల పెద్దపులులు
దారిద్ర్యాల పెనుభూతాలు
అనుక్షణం శరీరాన్ని మనస్సుని
దహించివేస్తున్నా

ఆవేదనల హాలాహలాన్ని మాలో మేమే దిగమింగి
సాహితీరసామృత శీతలచంద్రకిరణాల్ని
లోకానికి వెదజల్లుతున్నాం

మాలిన్యంఅంటని మనస్సులు మావి
పసిపాపల నైర్మల్యం మాది
ఐశ్వర్యంకోసం పాకులాడడం
అంతస్తులకోసం కీచులాడం

# ఉ ద య రా గ పు గు లా బీ లు

వినీలాకాశం ఉదయరాగపు
గులాబీల కాంతులతో
మెరుస్తుండే
పచ్చని చెట్లమీద
రంగురంగుల సుమబాలలు
అందంగ అమాయకంగ విచ్చుకుంటుండే
ప్రభాతపవనాలు చల్లగా మెల్లగా వీస్తుండే
ఏ ఐశ్వర్యం ఇవ్వలేని ఆనందం
ఏ అంతస్తులు ఇవ్వలేని సంతోషం
హృదయంలో చోటుచేసుకుంటాయి

రసప్లావితమైన రచన చదివినా
కన్నీటితో తడిసిన హృదయానికి ఊరట కల్గించినా
మమత, మానవత ఉన్నమనిషి
ఒక్కసారి పలకరించినా
ఆణిముత్యంలాంటి రచన ఒక్కటి చేయగల్గినా
జన్మ ధన్యమైందనిపిస్తుంది
బ్రతుకు సాఫల్యం పొందిందనిపిస్తుంది.

# లతాంగి

పురుషవృక్షంమీద
లతలా ప్రాకినంతకాలం
లతాంగికి బానిసత్వం పోదు
సమానత్వం రాదు!

భర్త పెట్టే కష్టాల్నీ అవమానాల్నీ
నెత్తుటిసీడల్లో కన్నీటిపాటల్లో దాచిపెట్టి
అనుక్షణం ఆత్మహత్యజరుగుతున్న మనస్సుమీది శరీరాన్ని
తిండికోసం, నీడకోసం మగవాడి కప్పగించే
మగువల పరిస్థితులు మారాలంటే—

ఎండనక వాననక
రేయనక పగలనక
బానిసలా బండచాకిరీ కంకితమై
పురుషుల ధర్మశాస్త్రాగ్నిలో సమిధలై ఆహుతౌతున్న
స్త్రీల శ్రమదోపిడి పోవాలంటే
కన్యలను పశువులా పరీక్షచేసి
మంగళసూత్రాన్నే ముక్కుతాడుగా పోసి
బందిఖానాలో పడేసే ఈవ్యవస్థలో
సమూలమైన మార్పు రావాలంటే—

స్త్రీలోని విప్లవశక్తి విజృంభించాలి
అణచబడ్డప్రతిభ వికసించాలి
సమతాసమాజాన్ని నిర్మించాలి!

# గీతలం

మంతనమే ఆయుధంగా
బుద్ధిబలమే ఆస్తికాగా
మంచిమిత్రులే కంచుకోటగా
మసులుతుండే సజ్జనులకీ
వసుధలో విలువతక్కువ.

దుష్టత్వమే మారణాయుధంగా
మూర్ఖత్వమే మహావరంగా
ధనసంపాదన జీవితలక్ష్యంగా
అధికారమదం యావదాస్తిగా
సంక్రమించిన కొందరి చేతుల్లో
జాతికి వెలుగుపంచే మేధావులు
ఆటబొమ్మలై ఆడుతున్నారు.

బ్రతుకుబరువుతో మేధావులమెడలు
అధికారుల బలిపీఠాలముందు వంచబడుతున్నాయి
ఆ మేధావుల మెదళ్ళలోని సూర్యోదయాలు
మనదేశంలోనే వెలుగులు చిందించేరోజు
అధికారుల దోపిడి అంతమయ్యేరోజు
నాజాతి నిండుగా వికసించేరోజు
నాకలం గీసే గీతల్లో
రూపు దిద్దుకుంటోంది !

# నవమహిళ

ఆడదాన్ని అణచిఉంచే అల్పమనస్తత్వం
మనలో ఇంకా దాగే ఉంది
వనితల కంటినీళ్ళని ఒంటిదెబ్బల్ని చూపించే
సినీమాల్లో, సాహిత్యంలో
ఆనందం వెతుక్కుంటూనే ఉన్నాం
స్త్రీల పాదదాసిత్వం, ఆత్మాహుతులూ
ఇంకా మనపుణ్యభూమి పాతివ్రత్యాన్ని కాపాడుతున్నాయి !
మహిళల స్తన జఘనాల ఒంపుల్లోంచి
రేప్ సీన్ల మత్తుల్లోంచి
రూపాయలవర్షం కురిపిస్తోంది.

ఈ వ్యాపారనాగరికత !
నిలువెల్లా దహించే ఆకలిని
మధురగీతంగా మార్చి 'రా రమ్మ'ని పిలిచే
వెలయాలి ఆక్రందన
శ్రవణానందంగా వింటున్న పెద్దమనుషులు
(పెద్దపులులు) న్న సమాజం ఇది !

ఉద్యోగపుహోదాలని పెంచడానికి
వ్యాపారపులాభాలని పొడిగించడానికి
భార్యలనే ఎరగా వేస్తున్న
వేటగాళ్ళున్నారిక్కడ.

శారీరక మానసికశక్తుల్ని పెంపొందించుకుని
ఆర్థిక అసమానతలని, సాంఘికదురన్యాయాలని పారద్రోలి
అబలలు సబలలుగా మారి
ఈ అన్యాయపుచీకట్లని ఛేదించాలి!

శతాబ్దంకింద భర్తృత్వపు నియంతృత్వానికి
చరమగీతం పాడిన ఇబ్సెన్ కావ్యనాయిక
'నోరా'లు ఈదేశంలో అడుగడుగునా జన్మించాలి!

వెనకబడిన దేశంలో
వైప్లవ్యజ్యోతులు వెలిగించాలి!
ఆ జ్యోతుల్లోంచి నవమహిళలు రూపొందాలి!

# నవకవిత

ఇంతకాలం పండితులకే పరిమితమై
గ్రాంధికభాషా వశమై
సామాన్యజనులకి దూరమైపోయిన కవిత
ఈనాడు దగ్గరై కష్టసుఖాల్లో భాగస్వామినియై
శాంతిని కాంతిని అందిస్తూ
ఉషోదయగీతం ఆలాపిస్తోంది

శబ్దాడంబరాల పద్మవ్యూహంలో చిక్కుకోక
అలంకారాల అందాలకి బందీకాక
ప్రాససుందరి జిలుగుపైట తళుకుల్లో
కవితాసుందరి దాగుందని భ్రమపడక
ప్రజల సమిష్టిశక్తిలాంటి వ్యవహారిక భాషలో
సూటిగా చొచ్చుకపోయే పదజాలంతో
ఉదాత్తమైన భావంతో
సమసమాజ చైతన్యాన్ని
నవకవిత గానంచేస్తోంది

పదవులకోసం పాకులాడక
ధనంకోసం జనాన్ని విడువక
సమాజంమీద తిరుగులేని తిరుగుబాటు సాగిస్తోంది
యువతరంలో వికసించే నవకవిత
నవతరాన్ని నిర్మించే యువకవిత!

# కవితా దీపాలు

దీపాలివి ! దీపాలు ! వేనవేలు దీపాలు
మనస్సులోని అంధకారం మాయంచేసి
జ్ఞానజ్యోతిని వెలిగించే కవితాదీపా లివి !

మూగజీవుల వేదనలోంచి రగిలిన సమతాదీపాలు
చదవడానికి సుళువుగా ఉండే
ఈకవితల చాటున
జీవితపుబడిలో నేర్చుకున్న కష్టసుఖాల పాఠాలున్నాయి !
లోకానుశీలనం అభ్యాసం ఉంది
విద్యఇచ్చిన వివేకం ఉత్తమగ్రంథా లందించిన
విజ్ఞానం ఉంది
హృదయాంతర మథనంలోంచి ఉదయించిన
సాహిత్యామృతదీపా లివి !

సదసద్వివేచనా శక్తిగల
మనస్సనే ప్రమిదలో, ఆవేదన, అనురాగం అనే తైలంపోసి
బుద్ధిఅనే వత్తివేసి సాహితీజ్యోత్స్నతో వెలిగించిన
దివ్యదీపా లివి !

కవితాసాక్షాత్కారం సుళువుకాదు
అందీఅందక మురిపిస్తుంది కవితాకన్య
ఎడనెడ కాంతిరేఖల జిగేల్మని

మెరిసిపోతూ ఆనందింప జేస్తుంది
కష్టసుఖాల్లో తోడునీడై నిలుస్తుంది
సహృదయుల మనఃకమలాల్లో ప్రకాశిస్తుంది

దీపాలివి ! దీపాలు !
వేనవేలు దీపాలు !
కవితాదీపాలు !
సమతాదీపాలు !

# కాంతి వర్షం

జగత్తునిండా సమతల మమతల
నవకాంతివర్షం నిండుగా మెండుగా కురిసింది

ఆవర్షంలో తడిసి పునీతమైన ప్రకృతిలో
అందం ఆనందం వెల్లువలై ప్రవహించాయి
పొలాల్లో ఫ్యాక్టరీలలో శ్రమ తక్కువ ఫలితం ఎక్కువ
అందరికోసం ఒక్కరు ఒక్కరికోసం అందరు
వనితల కాటుకకన్నుల్లో సంతోషపు వెన్నెలలు

బాలబాలికల సుందరవదనాల్లో
ఉజ్వలభవిష్యత్ కాంతిరేఖలు
ఎవరితోమాట్లాడినా స్నేహం పన్నీటిజల్లులు
ఎవరింట్లోచూసినా సాహిత్యపుసరదాల పాలవెల్లులు
ఏ గాలితరంగాల్ని కదలించినా
సంగీతపురాగాల రంగవల్లులు

మారణాయుధాలు రణరంగాలు మాయమయ్యాయి
కళ్యాణవేదికలు కరుణాతరంగాలు కళకళలాడాయి
ఫ్యూడల్ బూర్జువాతత్వాలు తొలగిపోయాయి
కులమతాలు కూలిపోయాయి

ఈవసుధంతా ఒకే ప్రభుత, ఒకే జనత—
జరావ్యాధుల కరాళనృత్యం నమసిపోయి
మానవోత్సాహాల సుధాతరుణాలు
ప్రతిఒక్కరి రక్తనాళాల్లో
ఆనందనాట్యాలు చేస్తాయి—

దోపిడీనుంచి దారిద్ర్యంనుంచి భువి విముక్తమైంది
స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో పృథ్వి కనువిందు చేస్తోంది.



అవసరాన్ని మించి పేరుకొన్న ఆస్తి
మానవత్వాన్ని మంటగలిపి
దానవత్వానికి దారితీస్తుంది.

## స వ ర ణ

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 12 | 3 | గుండుల్లో | గుండెల్లో |
| 22 | 10 | మెచ్చిన | మెచ్చని |
| 28 | 1 | ఖేదం | ఖేదం |
| 32 | 3 | బాపె | బాపి |
| 47 | 6 | టుండే | టుంటే |
| ,, | 7 | స్తుండే | స్తుంటే |
| 56 | 3 | మా...తరుణాలు | యా...తరంగాలు |